చున్నదియును, అనఁగా నొండొరులపై హస్తములుంచఁబడుచున్నయట్టి సఘ.....చంబుగా.
సఘన — నీతియ్యనైన, అధరోష్ఠ — క్రిందిపెదవియొక్క, సమంతాత్ — అంతటను, నిపీడన — బాధ
పెట్టఁబడిన్నై, అనఁగా నధరామృతపానము సేయుచున్నయనుట, ప్రౌఢత్వ — దుడుకుతనముచేతను. అతి
శయముచేతను. అనుకంపా — దయచేతను, మితంపచంబుగా — మితిగాఁ గల్గినట్టియును. ఇచట
'మితంపచ' శబ్దమును గూర్చి "సూ. పరిమాణేపచః" 'మితనఖేచ' సిద్ధాం. "ఉదా. ద్రోణంపచా స్థాలీ
మితంపచా బ్రాహ్మణీ" అజ్ఞాత...లిహంబుగా: అజ్ఞాత — అల్పముగాఁ దెలియఁబడిన, "అజ్ఞాన
దృశ్యమభావేశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ప్రకీర్తితాః" పూర్వరతి —
ప్రథమసంభోగముయొక్క, ఔన్నత్య — అధికముచేత, అనఁగా మొదటికలయిక బొత్తిగాఁ దెలియ
కుండునట్లుచేసె ననియర్థము. పునరుపక్రమణ — మరల నారంభించుటయు, యాచ్ఞా — అడుగుటయు నెడు,
వచో — వాక్యములయొక్క, అర్థంలిహంబుగా — అకారము నాస్వాదించుట కలిగినట్టియును, అనఁగా
బునస్సంగమమునకుఁ బ్రార్థించుచున్న మాటలయొక్క ధ్వని యాకసమ్ము నంటుచున్నదనుట. కాఁగన్ —
అగునట్లుగా, సురతంబుసల్పి — సంపర్కముచేసి, అక్కమలముఖియున్ — పద్మమువంటిముఖము గల
దయిన యారంభయును, ఇచట 'అక్కమలముఖి' అనుచోట "సూ. ఇదమదసేతద్యతచ్ఛబ్దాశ్చబ్దాన్త
రాన్వయే బహుళం హ్రస్వం ప్రపద్య దీర్ఘాద్విత్వముపర్యక్షరస్యజనయంతి" నన్న. "ఊష్మరేఫాద్విరా
ద్విత్వమయుక్తస్యాప్యుపస్థితః; ఋకారంచ విముచ్యస్యా త్ప్రాణాంచాన్ద్విత్వసంగతిః" అథ. అమహీ
మర తనయుండున్ [illegible] యైన యానిరంకుశుఁడును, అంతన్ — అంతట, చాలన్ —
అలసి — ఎక్కువగా బడలికొనవారై, వల....గుబు. వలరుచిత — చుట్టుము చుట్టఁబడిన, దివ్యాంశుక —
మనోహరములైన వస్త్రములచేత, ఆవృత — ఆవరింపఁబడిన, చుట్టఁబడిన, అంగులు — శరీరము
గలవారు, అగుచున్ — అయి, తమచేతలకున్ — ఆయిద్దరును చేసినపనులకు, తామె — వారంతట
వారే, నగుచుండి — నవ్వుకొనుచునుండి, ఇందు 'వదన...జంబు' 'పునరుప...లిహంబు' అను క్త
విషయస్వరూపోత్ప్రేక్ష. "క. ఫలితను హేతుత వస్తుత, నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్,
తొలితరంబును సదసద్విష, యలు కధితాకధితవిషయ యంతియయు నగున్" అలం. సా. సం. ప్రపద్య
మంతయును ప్రౌఢమునకుఁ జెప్పఁబడినది. ఉదాత్తాలంకారమును. "ఉదాత్తం వస్తునః సంపత్, మహతాం
చోపలక్షణమ్" కా. ప్ర. 'ఉత్సాహభావమును. క. అత్యున్నతలోకోత్తర, కృత్యంబులు నేయు
వేడ్క కృత్యకృత్యు విలస్, విత్యమ్ముఁ దలఁచు ప్రయత్నం, బత్యంతోత్సాహ మయ్యె'' కా. సు.
"వదన...జంబు" ఇత్యాదులచే సంభోగావస్థ వర్ణింపఁబడియున్నది. "అనుకూలౌ నిషేవేతే యత్రా
న్యోన్యం విలాసినౌ, దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః". ఉదా. త్వం ముగ్ధాక్షి వినైవ కంచు
లికయా ధత్సే మనోహారిణీం, లక్ష్మీ మిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికాసంస్పృశి, శయ్యోపాంత
నివిష్టసస్మితముఖీ నేత్రోత్సవానందితో, నిర్యాతః శనకై రలీకవచనోపన్యాస మాలీజనః". అమరు.
"గాఢాలింగన పీడన స్తనతటం స్విద్యత్కపోలస్థలం, సందష్టాధరము క్తసీత్కృతమ భ్రభ్రాంతభ్రూనృత్య
త్కరం, చాటుప్రాయవచో విచిత్రమణితం ఘాతైరుతైశ్చాంకితం, వేశ్యానాంధృతిధామ పుష్పధనుషః
ప్రాప్నోతి ధన్యోరతమ్". శృం. తి. రంభానిరంకుశులు సంభోగముచే 'వలసియుండి రనుటకుచా.
"మహోద్రగ్ర: [illegible] బురుకుసుమ[illegible] ప్రకరంబై కాంక్ష
చేముకవృతులఁ బదరి పైఁ బ్రాథిపాటించునిట్లు; [illegible] దనన్ని పీరా [illegible] రట్లో
మున్న [illegible] సా. రుకీలర గందర్పు డోటుం [illegible] అను. [illegible]

మాత్రకే' మే. విశారదుఁడవు — నేర్పరివి, ఔనుపో — అయియున్నావు సుమా, అని — ఇట్లుపలు కుచు, తన్నున్ — అతనిని, మెచ్చుచోన్ — శ్లాఘించుచున్న సమయమున, ఇందు మొదటిపాదమున 'జాలిరి' అనుపదము శేషముగా నున్నది. కొందఱు దీనిని శకటరేఫముగా వ్రాయుచున్నను ఈగ్రంథ కర్త రెండురూపములతో నిష్పత్తియుఁ బ్రయోగించిన ట్లూహింపవలసి యున్నది. (స్వా 21-63చూ) 'ని. జారు — పలాయితుఁడవు, ముడివీడు. కాలైనను మాలైనను జారు నీళ్ళుజారు' ఆం. దీ. 'జాఱు — పలాయితుఁడవు' ఆం. దీ. ఆంధ్రపదపారిజాతము మున్నగు నిఘంటువులయం దీరెండురూపములు కన్పట్టుచున్నవి. 'ని. జారు (క్షరణము) గళనము, జారుట. పలాయనమనుట. వదలిపోవుట. 'జారు ముడి. కేశబంధవిశేషము' ఆం. వ. పా. "ని. జారి. పలాయితుఁడవు. ముడివీడు' శ. ప. ప. ఉదా. 'వ. జారు కొప్పులం దొరఁగువిరిగుత్తులతో' వసు. వ్యా. జారు......రంగు, జారుకొప్పులం దొరఁగు— జారుసిగలవల్లనుండి రాలుచున్న, చతు. 2-3. 'మ. తజ్జలసూత్రంబులు వ్రాకె తుంపురులుగా జారుచ్' వసు. వ్యా. తుంపురులుగాజారుచ్ — శీకరములుగా జారుచు, మంచోయనన్ — హిమమా యనునట్లుగా జారెనని సంబంధము. (వసు. 93 పు) మఱియు నాలుగవపాదమున 'ఔదార్యి' శబ్దము నందలి 'ఔ' వర్ణమునకును 'జౌ' వర్ణమునకును యతి చెప్పఁబడినది. దీనిని నిత్యసమాసయతి యందురు. తే. పదము విభజించి చెప్పఁజో ♦ ప్పవనియుతియు, సవ్యశబ్దంబుఁ గాని విగ్ర ♦ హంబుఁ జెప్ప, నదియొ నిత్యసమాసమై ♦ యతులఁ గృతుల, నంటి సంధించుచుఁ ♦ గ్లుముచివంతి' సుల. ఈపద్యమున 'మెచ్చుచోన్' అనుటకుదా. 'ము. శోకుచొచ్చెనాము పాదంబునన్, నోలఁగంద్రాచ లతాంగి' పార. 'సీ. దేవిఁ గాఁ బ్రీతితోఁ జేని నీ గాంచితి, ననినయున్నచో పిగా ♦ త్ర్యపదనిక్కి, పాడిపనువిఘ్ననుఁ ♦ పాదెంప' భార. స్వభావోక్త్యలంకారము 'స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తువర్ణనమ్' ప్రతా.

తా॥ సంధ్యాకాలమున ముడివీడిన శిరోజములు జక్కఁగా మెప్పుకొనుచు నువికిఁ జీరి వయ్యా దతో నొడలిచమ్మటచుక్కలాలునట్లు విసరికొనుచు, తాంబూలముయొక్క సువాసన దిశలయం దంతటను వ్యాపింపఁగా నతనితో నురతవిద్యయందుఁ జాతుర్యముగలవాఁడవు నీతో నెవ్వరు సరిరా రని పొగడుచున్న సమయమున.

—: నిరంకుశుఁడు నారదునిం గాంచి రంభతోఁ బ్రశ్నించుట :—

వ॥ యథేచ్ఛగా నభోమార్గంబునం జనునారదునిం గాంచి యాచిగురుఁబోఁడి కతం డిట్లనియె. 9

అ॥ యథేచ్ఛగాన్ — ఇష్టమువచ్చినట్లుగా, 'యథాసాదృశ్య, ఇత్యవ్యయీభావః' 'ని. ఇచ్ఛా కాంక్షాస్పృహేహాతృడ్వాంఛాలిప్సామనోరథః' అ. నభోమార్గంబునన్ — ఆకాశపథమున, చను నారదున్ — పోవుచున్న నారదుఁ డను మహర్షిని, కాంచి — చూచి, అతండు — ఆనిరంకుశుఁడు, ఆచిగురుఁబోఁడికిన్ — ఆదేవవేశ్యతో, ఇచట 'చిగురుఁబోఁడి' అనుటకు 'సూ. అలరుఁబోఁడిత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' ప్రౌ. వ్యా. ఉదా 'మ. చిగురుంబోఁడి రయంబుగ దే' కళా ఇట్లనియెన్ — ఈచెప్పఁబోవురీతిగఁ బలికెను, ఇందు 'ఆచిగురుఁబోఁడికతండిట్లనియె' అనుచోట షష్ఠీవిభక్తి యనుటకు "సూ. షష్ఠీస్థానికంబగు కువర్ణకంబాకొక్కచో ద్వితీయావిభక్తులకుమాఱుగా: వత్తదర్థంబులం జూపట్టెడి' ప్రౌ. వ్యా. ఉదా 'అంగపతికనిరించెన్' కళా.

సీ॥ కారుణ్యరసవృష్టిఁ ♦ గమనీయతనుయష్టి, చిగిరించె నా జటా ♦ శ్రీ దలిర్ప
నమృతఘనీభావ ♦ మనఁగ నొప్పువిభూతి, ధవళితాంగరుచి ♦ దివిఁ జెలంగ
హస్తాంబుజంబుపై ♦ నానుమచ్ఛదపరం, పర నాఁగ రుద్రాక్ష ♦ మాల దనర
సముదంచితానంద ♦ జలధి ఘూర్ణిలుమాడ్కి, మారుతాహతిచేత ♦ మహతి మ్రోయఁ
తే. ప్రకట తేజోవిశేషంబు ♦ బాలసూర్య, సృష్టి గావింప నయనసం ♦ తుష్టి గాఁగ
నరుగుదెంచుచున్నవాఁ ♦ డభ్రవీథి, నీతఁ డెవ్వాఁడు దివిజపూ ♦ ర్ణేందువదన. 10

అ॥ దివిజపూర్ణేందువదన — నిండుచందమామవంటి మోముగల యో దేవలోకకాంతా, కారుణ్యరసవృష్టిన్, దయారసముయొక్క వర్షముచేత, దయయనెడు జలముచేత ననియుఁ జెప్పవచ్చును. ఇచట 'కారుణ్యరస' మనుటవలన. "సీ. కరుణారసముపొంగి తొరగెనుచామ్పున, శశిరేఖనమృతంబుజాలువాఱి" భార. రసశబ్దమునుగూర్చి 'ని. శృంగారాదౌ కషాయాదౌ ♦ ఘృతాదౌ చ విషే జలే, నిర్యాసే పారదే రాగే వీర్యే చ రస ఇష్యతే' ధనం. "గుణే రాగే ద్రవే రసః" యాద. కమనీయతనుయష్టి — ఇంపైన దండమువంటి దేహము, అనఁగా గఱ్ఱవంటి మేననుట. చిగిరించెనాన్ — పల్లవించెనేమో యనునట్లు జటాశ్రీ — జడలయొక్క సంపద, తలిర్పన్ — అతిశయించఁగా, అమృతఘనీభావము — సుధయొక్క గడ్డకట్టుట, అనఁగన్ — అనునట్లుగా, ఇచట అమృతశబ్దమునుగూర్చి 'ని. పీయూష మమృతం సుధా' అ. ఒప్పువిభూతి — ప్రకాశించుచున్న భస్మముచేత, ధవళిత — తెల్లనయియున్న, అంగరుచి — శరీరముయొక్క కాంతి, దివిన్ — ఆకాశమునందు, చెలంగన్ — ఒప్పఁగా, హస్తాంబుజంబుపైన్ — తామరపూవువంటి చేతిమీఁద, అనుమచ్ఛదపరంపర — వర్తించుచున్న తుమ్మెదలయొక్క పరంపరయో నాఁగన్ — అనునట్లు, రుద్రాక్షమాల — రుద్రాక్షలతోఁ గూర్చిన జపమాలిక, తనరన్ — ప్రకాశించఁగా, సముదంచితానందజలధి, సముదంచిత — ఒప్పుచున్న, ఆనందజలధి — సంతోషమనెడు సముద్రము, ఘూర్ణిలుమాడ్కిన్ — ధ్వనిచేయుటవలె, అనఁగా సముద్రపు మ్రోతవలె ననుట. మారుతాహతిచేతన్ — వాయువుయొక్క తాఁకుడుచేత, మహతి — నాలుతంత్రులు గలదయిన తనయొక్క వీణ, 'ని. వీణాభేదేఽపి మహతీ' అ. మ్రోయన్ — మ్రోగుచుండఁగా, ఇచట నారదునివీణ మహతియనుటకు 'ని. విశ్వావసోస్తు బృహతీ. తుంబురోస్తు కలావతీ, మహతీ నారదస్య స్యాత్, సరస్వత్యాస్తు కచ్ఛపీ' వైజ. ప్రకటతేజోవిశేషంబు. ప్రకట — స్పష్టమయిన, తేజోవిశేషంబు — దీప్తియొక్క యతిశయము, బాలసూర్యసృష్టిగావింపన్. బాలసూర్య — ఉదయించుచున్నట్టి సూర్యునియొక్క, సృష్టి — పుట్టుకను, గావింపన్ — కలుగఁజేయఁగా, నయనసంతుష్టి. నయన — కన్నులకు, సంతుష్టి — ఆనందము, కాఁగన్ — కలుగఁగా, అభ్రవీథిన్ — ఆకాశమార్గమున, 'ని. ద్యోదివౌ ద్వే స్త్రియా మభ్రం వ్యోమ పుష్కర మంబరమ్' అ. అరుగుదెంచుచున్నవాఁడు — వచ్చుచున్నవాఁడు, ఈతఁ డెవ్వాఁడు — ఈపురుషుఁ డెవఁడై యుండును, ఇచట 'ఈతఁడు' విశేష్యము ఉద్దేశ్యము 'ఎవ్వాఁడు' విధేయము. 'సూ. ఉద్దేశ్యవిధేయభిన్నంబు విశేష్యంబు' ప్రౌ. వ్యా. 'ప్రకటతేజోవిశేషంబు బాలసూర్యసృష్టిగావింప' ఉపమాలంకారము. పద్యమంతయు నుత్ప్రేక్షాలంకారము. "సంభావనమథోత్ప్రేక్షా ప్రకృతస్య సమేన యత్" కా. ప్ర. 'ఆనందజలధి- హస్తాంబుజము' రూపకాలంకారము. 'వృష్టి యష్టి' అన్త్యప్రాసాలంకారము.

తుష్ట్రమార్గాత్, గత్వాగత్వా ఘట్టకుట్యాం ప్రభాతకః'' ఇకను. కొన్ని వస్తువులనమ్ముకొని సుంకము చెల్లించకుండ రాత్రిపూట బయలుదేరి తప్పుత్రోవను బోగాఁబోగా. తెల్లవారుసరికి సుంకము చెల్లించు చోటు గృహమునకే చేరునట.

తా॥ ఇట్లు ప్రశ్నించినతోడనే యారంభ నిరంకుశునకుఁ గన్సైగఁ జేసెను. నారదమహర్షి యప్పుడే యామె రంభయనియు, నీతఁడు బ్రాహ్మణసుతుఁ డనియు తెలిసికొనెను.

ఉ॥ భూసురపుంగవుండు ముని ♦ పుంగవుఁ గన్గొని యీతఁడెవ్వఁడో
కా సురకాంత యంచుఁ బలు ♦ కం గనుగీటె స్వనామగోపనే
చ్ఛాసముదీర్ణతన్ దివిజ ♦ సంయమియున్ దెలిసెన్ రతోత్సవా
భ్యాసుల సంతతోక్తిపరి ♦ హాసుల వారల మర్మకర్మముల్. 12

కవి పూర్వపద్యాభిప్రాయమునే మరలఁ జెప్పుచున్నాఁడు.

అ॥ భూసురపుంగవుండు — బ్రాహ్మణులలో శ్రేష్ఠుఁడయినట్టి నిరంకుశుఁడు. మునిపుంగవున్ — మునిశ్రేష్ఠుఁడగు నారదుని, కన్గొని — చూచి, ఇచట 'కన్గొని' అనుటకు "సూ. క్రియయా ఉపచారస్యాత్ ప్రసంగసంగతః అకర్మకస్య ప్రాపకస్య సకర్మకత్వమాత్రేణ సుసమ్మతిః" అని. ఇందు ఈ కారలోపమునుగూర్చి "గీ. కాంతచన్ద్రవచనగవ కార్మ్యముపుము, ... ప్రభు' అని. "సూ. క్వచిద్విభక్తేస్సమాసేఽపి ప్రాతిపదికస్య సంస్కృతిః' అని, సురకాంత — దేవతాస్త్రీలలోఁ జక్కని దానా, ఈతఁడెవ్వఁడో కా — ఈమహానుభావుఁ డెవ్వఁడో తెలియునుగదా, అంచున్ — ఇట్లు, పలుకన్ — మాట్లాడఁగా, స్వనామగోపనేచ్ఛాసముదీర్ణతన్, స్వనామ — తనపేరును, గోపన — దాఁచుటయందు, ఇచ్ఛా — అభిలాషయొక్క, సముదీర్ణతన్ — ఉదాత్తభావముచేత కనుగీటెన్ — కనుసైగఁ జేసెను, దివిజసంయమియున్ — దేవమునియగు నారదుండును, రతోత్సవాభ్యాసులన్ — రతోత్సవ — సంభోగమువలని సంతోషముయొక్క, అభ్యాసులన్ — వాసనకలిగినట్టివారిని, సంతతోక్తి పరిహాసులన్ — సంతత — ఎడతెగని, ఉక్తి — పలుకులతోఁ గూడిన, పరిహాసులన్ — నవ్వుగలవారిని, వారల మర్మకర్మముల్ — వారియొక్క రహస్యమైనపనులు, అనగా నెవ్వరికి దెలియనియట్టి నీయిరువురు చాటుగా, జేసినపను లన్నియు ననుట; తెలిసెన్ — ఎఱింగెను, ఈపద్యమున 'ఈతఁడెవ్వఁడో కా సురకాంత' అనుటకుఁదా. 'చ...... మేనిజిడ్డువోఁ, గడిగికొనంగ వచ్చెననిఁ కా శివుకౌదలయేటఁ బావముల్, తొలఁగ నోలలాడుచు, అనిన్ జై. భా. ఓరంభా! ఈతఁడెవ్వఁ డనుచుండ సైగఁజేయుట గనిపెట్టిన నారదుఁ డుభయుల మర్మకర్మములనుగూడ గుర్తించెననుటచేత సూక్ష్మాలంకారము. భ్యాసులన్ హాసులన్ — మర్మకర్మముల్ — అంత్యానుప్రాసాలంకారము.

తా॥ నిరంకుశుఁ డామునివరేణ్యునిఁ గాంచినతోడనే యోరంభా ఈమహనీయు డెవ్వరని యడుగుచున్నంతలోనే తనపేరాసంయమి వినకుండునట్లు చేయ నభిలషించినదై యాతనికి సైగఁజేసెను. ఆదేవర్షి గూడ వీరిసంభోగవిషయ క్తచిహ్నములను ఎడతెగని పరిహాసవాక్యములనుగట్టుగాఁ జేసికొను చున్న సంజ్ఞాక్రియలను సమస్తమును గ్రహించెను.

వ॥ అపుడు నారదుండు తనమనంబున. 13

క్రూరత్వమును, చూపఁగాన్ — కనపఱచుట, తగునె — చెల్లునా, చెల్లదనుట, ఇందు 'ఉండినసుండదనీ' అనుప్రయోగమునకు 'సూ. ప్రార్థనాదులం దన్యపత్యయాంతక్రియలవిగా దియిమ్ము కికారంబు విభాష నగు' ప్రౌ. వ్యా. ఉదా. 'మ. మునిధర్మంబులకెల్లవ ద్వని జనంబుల్ నవ్వినన్ నవ్వనీ' కళా. 'సూ. పునర్విధారణాద్వృత్తాత్క్వచిన్నిష్ఠానవర్ణకాత్' అధ. 'ఉండినఉండనీ - గాకమాకయోః కేళిలోలలై, అనుప్రాసాలంకారము.

తా॥ భోగలాలసులై యిరువురుచెంతనుండినవారె. దుర్మార్గుఁడు నీవెయేకదా! ఇంతటనైనను మన్సుద్ధిగలది యనులోకనిందను బొందక మావంటిమహాత్ములను నమస్కరింపగూడదా! పాపము వీనిగతి యేమి కానున్నదో అదియును వాఁడును వచ్చుమహాత్ముల మగు మావంటివారియెదుట తమ చెడుబుద్ధి విశదమగునట్లు కపటకృత్యములతోఁ బ్రవర్తింపఁ దగునా.

## —: నారదుఁడు దేవలోకమునకేగుట :—

శా॥ కానీ దీనికిఁగా నొకానొకప్రసం ♦ గం బింద్రునొద్దన్ వచో
న్మానప్రౌఢిమఁ జెప్పి కొంతకలహం ♦ బుం బెంచఁ జోటుండఁగా
నానాభూములకేగ నేటికి వృథా ♦ నాకంబుచేరంజనం
గా నిట్టిప్పుడె వేళయంచు జనియె ♦ న్గౌతూహలాభ్యున్నతిన్. 16

అ॥ కానీ — అయినదిగానిమ్ము. సహేమంచిదిలే. బెదరించుటను దెలియజేయును. 'ని. సీ. కాని కానీయనంగ వికల్పమునకు, నెదుటి వాక్యవిరుద్ధమునకు' ఆం. శ. ని. 'సూ. ప్రార్థనాదులయందు ఇమ్ము నకు ఈవిభాషనగు' బా. వ్యా. ఉదా. ద్వి "ఆనందమున కలకాంత యుదెంచి కాంచి, కాని కానీ పోదు గాని లెమ్మనుచు, నాఱవైనతనచేల నొకకోలఁబూని, తలుపువిత్తరము తత్తరము రెట్టింప" అష్ట. దీనికి గాన్ — ఇందునిమిత్తమై, ఇంద్రునొద్దన్ — ఇంద్రుని సమీపమున, ఒకానొకప్రసంగంబు — యేదియో యొకప్రస్తావన, వచోనూనప్రౌఢిమన్ — వచో — వాక్కులయొక్క, నూన — నిశ్చయమైన, 'ని. నూన మవశ్యం నిశ్చయే ద్వయం' అను. ప్రౌఢిమన్ — నేర్పుతో, ఈప్రౌఢిమశబ్దమునుగూర్చి ద్వి. 4 వ పద్యమునఁ జెప్పబడియున్నది. చెప్పి — బోధించి, కొంతకలహంబున్ — కొంతకయ్యమును, పెంచన్ — వృద్ధిచేయుటకు, చోటుండఁగాన్ — తావుండగా — తగినసమయముండగా, నానాభూములకున్ — అనేకస్థలములకు, 'ని. నానానేకోభయార్థయోః' అని. అ. ఏగనేటికిన్ — పోవుటయెందులకు, వృథా — వ్యర్థము, 'ని. వృథానిరర్థకావిధ్యోః' అమ. ఇచట నవ్యయప్రయోగమునుగూర్చి 'సూ. ప్రత్యయార్థావ్యయస్యాపి ప్రయోగః క్వచిద్భవేత్' అధ. దీర్ఘాంతమునుగూర్చి 'సూ అవ్యయస్యే తరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణా కథితస్తద్భవస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్' అధ. నాకంబు చేరన్ — స్వర్గంబునకు సమీపించుటకు, చనంగాన్ — పోవుటకు, ఇట్టిప్పుడె — ఇటువంటిసమయమునవే, వేళ — మంచియదను, ఈతఱిసమయము, అంచున్ — అనుకొనుచు, కౌతూహల — కోరిక యొక్క, అభ్యున్నతిన్ — అతిశయముతో, చనియెన్ — పోయెను, ఈపద్యమున ఇట్టిప్పుడె అని ప్రయోగించుటకు సూ. 'క్వచిత్ సంస్కృతీయోఽపి ప్రాణోప్యత్ర చ్యుతోభవేత్' అధ. 'ఇప్రత్యయం తావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' ప్రౌ. వ్యా. ఉదా. 'మ. వెఱ చిట్టంబుధినాథనందనులు

దోషీభాగ్యంబు సాలించి యందలి పొలింగ' నిర్వ. చ. 'ప్రియముల్ సెప్పిన నన్ను గైకొనక దర్పించి చిల్లు ఖాల్మత్వ దుర్నయశీలంబున నూరకుండితివి' జై. భా. వృథా యనుప్రయోగమునకు సూ. అన్య యస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుశర్మణాకృతః స్వర్యపస్యాపి దీర్ఘాంతత్వం క్వచిద్భవేత్ ॥ అథ. ఉదా...... 'నీకు నిది చేసితేమి వృథా శపింతురే' స్వా. మ. ఇందు ద్వితీయపాదమున సమాసగత మైన 'ఊ' కారమునకును విశ్రమస్థానమునఁ గల బకారముపైనున్న ఉ కారమునకును ఖండయతి చెప్ప బడి యున్నది. ఉదా, జాంబవద్వీపమునందు గోవులకు నిమ్ముగ జేయుటయుం బ్రసన్నమై, అని. కావ్యా చూ, 'కానీవీనికిగా నో కానసోకి' అనుప్రాసాలంకారము.

తా॥ కానిమ్ము యీ మునిమిత్రపై యాసుంపతితో నేడు యొక్క ప్రస్తావన పళంలుపు. నా నేర్పుకొలఁది వశీకరించి కొంతతగవును బెంచుటకుఁ బోవున్నదిగదా పవిత్రప్రదేశములఁ ద్రిమ్మరు టెలసి నిష్ప్రయోజనము. దేవలోకము నిండిపోనిసగముఁ బోవనిదెయు మంచితరుణము. అని తనలోఁ దానూహించుకొనుచుఁ గాంత్సతో నేగెను.

వ॥ అంత నక్కాంతాతిలకం బాతనితో నిట్లనియె, 17

అ॥ అంతన్ — అంతట, అక్కాంతాతిలకంబు — చక్కనిస్త్రీయొక్క యాకాంత యారంభ, ఆతనితోన్ — ఆనిరంకుశునితో, ఇట్లనియెన్ — ఈ చప్పఁబోవువిధముగాఁ బలికెను. ఇందు 'అంతనక్కాంత' అనుప్రాసము.

—: రంభ విచారపడుట :—

ఉ॥ ఎక్కడివాఁడ వోయి యొక ♦ యింతయు నెఱుంగవు బుద్ధికౌశలం
బెక్కడి కేగె నాలుకప ♦ యిన్నువుగింజయు నానసట్టి బ
ల్తక్కరి నారదుం డతఁడు ♦ దైవతమార్గమునందు నేగఁగా
నక్కట నన్నుఁ బేర్కొనితి ♦ వాతఁడు విన్న ననర్థ మొందదే. 18

అ॥ ఓయి — ఓ బ్రాహ్మణుఁడా, ఎక్కడివాఁడవు — ఎక్కడనుండివచ్చితివి, ఒకయింత యెఱుంగవు — కొంచెమైనను దెలిసికొనలేవు, బుద్ధికౌశలంబు — మతియొక్క నేర్పరితనము, ఎక్కడి కేగెన్ — ఏస్థలమునకుఁబోయెను, ఏమయ్యెను, అతఁడు — ఆముని, నాలుకపయిన్ — నాలుకమీఁద, రసజ్ఞాతలమున, నువుగింజయున్ — ఒక్క నువ్వుగింజసైతము, ఒక్క తిలబీజమైనను, నానసట్టి — నాను నంతటి కాలమైనను నిదానమును గట్టునులేని, బల్ — అధికమైన, తక్కరి — మోసగాఁడయిన తక్కు + అరి — తక్కరి. ఇదిటక్కరిరూపాంతరము, నారదుండు — కలహములు పెట్టువాఁడైన నారదమహర్షి, దైవతమార్గమునందున్ — దేవతలకు సంబంధమైన యాకాశపథమునందు, ఏగఁగాన్ — పోవుచుండఁగా, అక్కట — అయ్యో, ఇది సంతాపార్థకము, నన్ను పేర్కొనితివి — నా పేరునఁబిలుచు చున్నావు, ఇచటన్ పేర్కొనెదవు, అనియైననుండవచ్చును, నాతనికిఁ దెలియునట్లు నా పేరుతోఁ బిలచు చుంటివనుట, ఆతఁడువిన్నన్ — ఆతగవులమారి ముని వినినట్లయిన, అనర్థమొందదే — కీడుగలుగదా,

ఈపద్యమున 'నన్నుఁ బేర్కొనితివి' అనుటకు 'సూ. వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు' శబ్దచిం. నీవు పేర్కొనుటచే మనసుకష్టము సంభవించు ననుహేతువుచేఁ గావ్యలింగము, 'కావ్యలింగం హేతోర్వాక్య పదార్థతా' కా. ప్ర.

తా॥ ఓయీ! ఎక్కడనుండివచ్చితివి. నీకుఁ గొంచెమైనను దెలియదే నీమతియేమైనది? నాలుక మీఁద నువ్వుగింజ నానునంతటి కాలమైనను నిదానమును గుట్టును లేని మిక్కిలి మోసగాఁ డయిన నారదుఁ డాకసమునఁ బోవుచుండఁగా నయ్యో నాపేరుతోఁ బిలుచుచుంటివి. ఆతఁ డీమాట విని నట్లయిన మనకుఁ గష్టముగలుగదా.

క॥ ఆతఁడు విన్నప్పుడె పురు, హూతుఁడు వినుటయును బుద్ధి ♦ నూహింపు శచీ
నేత విననేని వెతయగు, చేఁతయె కా తెలిసికొనుము ♦ సిద్ధము గాఁగన్. 19

అ॥ బుద్ధిన్—నీమనసునందు, ఊహింపు— తర్కించుము, ఇచట మువర్ణలోపమునకు 'సూ. ప్రార్థనార్థే ముశేకత్వేకథ్యయేమధ్యమార్థకః, విభాషాంతంవడంత్యేకే, నప్రాణేతుకదాచన' అధ. ఆతఁడు— ఆనారదుఁడు, విన్నప్పుడె — వినినకాలముననె, పురుహూతుఁడు — ఇంద్రుఁడును, వినుటయును— ఆలకించుటయును, ఇచటఁ గ్రియాన్వయ వాక్యంబు నవ్యంగ్యముద్యోతకంబగుటకు 'సూ. క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబులగు' ప్రౌ. వ్యా. శచీనేత — శచీదేవికి భర్తయగు నాయింద్రుఁడు, విననేని — ఆకర్ణించినట్లయిన, వెతయగు చేఁతయకా. కష్టముకలుగునట్టి, పనియేకదా ఇచటను వ్యంగ్యార్థద్యోతకముకలదు. 'చేఁతయకా' అనుటకు సూ. 'అ కానిత్యర్థకంబగు' ప్రౌ. వ్యా. ఉదా. అపజయమునకాలక్షించి, భార. సిద్ధముగాఁగన్ — నిక్కముగా, తెలిసికొనుము— ఎఱుంగుము, ఇందు రంభయొక్క పరకీయనాయికాత్వము సెప్పఁబడినది. 'క. అన్యయనఁగ నన్యోఢయు' అనిచంద్రా. అని నరస. అలం. అక్రమాతిశయోక్తి "అక్రమాతిశయోక్తి స్స్యాత్ సహత్వే హేతు కార్యయోః" అనిచంద్రా. ఈపద్యమున విషాద మను భావముచెప్పఁబడినది.

తా॥ అతఁడు వినఁగానే యింద్రునకుఁ జెప్పును. ఇంద్రుని చెవిఁబడెనేని కష్టముగలుగు పనియేకదా! రూఢిగాఁ దెలిసికొనుము.

గీ॥ మనము చేసినసుకృతసం ♦ పదఁ గతంబున, వినక పోయిన బ్రదికితి ♦ మనఘవర్య
విన్నయప్పుడె యొకకీడు ♦ వెదకుఁ గాని, మాని పెట్టినతంత్రంబుఁ ♦ గానలేఁడు. 20

అ॥ అనఘవర్య — పుణ్యపురుషుఁడవైన యోనిరంకుశుఁడా, మనము— మనమిరువురము, ఇచట 'సూ. ఉభయార్థే భవేదత్వమర్థభేదేక్వచిన్నతత్' అధ. 'సూ. భూయఉభయార్థవాచీయః కశ్చిద్భవతి నిత్యబహువచనః తస్యజనోముశసోల' శబ్దచిం. చేసిన సుకృతసంపదన్ — పూర్వము చేసికొనిన, పుణ్యముయొక్క యతిశయముచేత, అతఁడు— ఆనారదుఁడు, వినకపోయినన్ — వినకుండ వెళ్లినట్లయిన, బ్రతికితిమి — సుఖముగాజీవించుదుము, విన్నయప్పుడె — వినినకాలముననే, ఒకకీడు వెదకున్ — ఒక చేటును గలుగఁజేయుటకాలోచించును, కాని — అయినప్పటికిని, మౌని — ఆఋషి — పెట్టినతంత్రంబున్ — పన్నినయుక్తిని, 'ని. తంత్రంకుటుంబకృత్యేస్యాత్సిద్ధాంతే చౌషధోత్తమే, పరిధానేతంతు

వాయేచశాస్త్రభేదే పరిచ్ఛదే' మే. కానలేఁడు — కనుగొనజాలఁడు, అనఁగా నారదుండెంతచెప్పి నంతయే తప్పక జరుగునుట, ఇందు 'మన యదృష్టమువలన నాముహూర్తి వినకుండినచో మనము బ్రతుక గలము దురదృష్టవశమున నీపలు కతనిచెవిఁ బడినచోఁ గష్టముతప్పదు' అనుటచే విషాదమనుసంచారి భావము విస్పష్టమగుచున్నది. "విషాదశ్చేతసో భంగ ఉపాయాపాయ చింతనైః" అని పరిత్యా.

తా॥ మనయదృష్టవశమున పూర్వపుణ్యసాఫల్యంబున నతఁడు వినకుండ వెళ్లెనేని బ్రతుకఁగలము. వినిన తోడనే యొకక్రీడ గలిగించ బ్రయత్నించును. అయిన నీ ఋషిపన్నుగడల నాయింద్రుఁడు తెలిసికొనలేఁడు.

—: ధర్మశీలుఁడు ప్రశ్నించుట :—

క॥ ఆమాట విని యోఁకించుక, భూమీపతి నవ్వి మౌని ♦ పుంగవ కరుణా
ధాముఁ డగు నారదునకే, భామామణి యింత యేల ♦ భయపడియెనో. 21

అ॥ ఆమాట—ఇట్లుచెప్పిన యా పులహునివాక్యమును, విని— ఆలకించి. భూమీపతి — భూపతియైన యారాజు, ఒకించుకనవ్వి — చిఱునవ్వునవ్వినవాఁడై, మౌనిపుంగవ — ఓ ముని శ్రేష్ఠుఁడా, కరుణాధాముఁడు — దయకునివాసమయినవాఁడగు, అగు నారదునకే — అట్టి నారదమునినిమాచిన మాత్రముననే, భామామణి — ఆరంభ, ఇంత — ఇంతగొప్పగా, ఏలభయపడెనో . ఎందుకు భీతిఁజెందెనోకదా, అనఁగా నాతాపసునివలన గోపములేమిగదా యుండగనే యారంభ యేలభయపడెననుట, ఇందు హాస మనుభావము చెప్పబడినది 'వికృతి దర్శనాది జన్యా వికాసో హాసః' పరిత్యా.

వ॥ అని యడిగిన ధర్మశీలునకుఁ బులహుం డిట్లనియె. 22

అ॥ అని — ఇట్లని, అడిగినధర్మశీలునకు—ప్రశ్నించిన ధర్మశీలుండనురాజునకు, పులహుఁడు— పులహుఁడను మహర్షి, ఇట్లనియెను — ఈప్రకారముగాఁ జెప్పెను.

—: పులహుని సమాధానము :—

సీ॥ దివిజకాంతామణి ♦ యవనీస్థలంబున, కరుదెంచు టపరాధ ♦ మౌన కాద?
అదియునుంగాక మో ♦ హావేశమున మర్త్యు, ననుభవించుట నేర ♦ మౌన కాద?
ఇంత మాత్రమె చాల ♦ కేప్రొద్దు వానికి, ననుకూల యాటకే ♦ ప్పౌన కాద?
అది కారణంబుగ ♦ నమరేంద్రు సేవకు, నరుగమి యాగడం ♦ బౌన కాద?
తే॥ చూడుమా యెన్నివిధములఁ ♦ జూచికొన్న, రంభ యెడ దుండగము ధరా ♦ రమణవర్య
యది యెఱింగి చేరాదయ్యె ♦ నమరమౌని. కొండెగానితనానకు ♦ గురువు గాన. 23

అ॥ ధరారమణవర్య — రాజులలో శ్రేష్ఠుఁడవైనవాఁడా, దివిజకాంతామణి — దేవలోకమున నుండెడియావేశ్య, అవనీస్థలంబునకుఁ — భూలోకమునకు, అరుదెంచుట — వచ్చుట, అపరాధము—

నేరము, కానకాద – అగునా కాదా, ఇదియొక నేరమనుట, అదియునుంగాక – అంతమాత్రమే కాకుండ, మోహావేశమునన్ – మనసులోనియొక తెలుంగకుండుటవలన, మర్త్యున్ – ఒకమానవునితోఁ గూడి, అనుభవించుట – సంభోగసౌఖ్యములననుభవించుట. దోసము – తప్పు, కానకాద – అగునా కాదా, ఇంతమాత్రమె చాలక – ఈయపరాధముతో కాకుండ, ఎప్పుడున్ – ఎల్లప్పుడును. వానికిన్ – అతనికి, అనుకూలవతిగా – ఇష్టురాలనగుట, తప్పు – దోషము, కానకాద – అగునా కాదా, అనికారణంబుగన్ – ఆ ప్రేమవలన, అమరేంద్రసేవనన్ – దేవతాప్రభువగు నింద్రునిఁ గొలుచుటను, అనుగమి – పోనంపుట, ఆగడంబు – దుష్టత్వము, కానకాద – అగునా కాదా, ఇచట 'ఆగడము' అనుటను దా. "వ. అగణితసుక్తాదామాభిరామంబై ప్రేమాస్పదంబగుచుం గందర్పకర కంబు బిబ్బోకంబునాగడము సేయు కంధరాభాగంబు నగ్యంబును" నాగ. ప్ర. చూచువా – పరీక్షించుచు, ఛిన్నివిధంబులన్ – ఎన్నిరీతులచేత, గాంచికొన్నన్ – పరిశీలించినను, గంభవమొకన్ – ఆయప్పరగనయుండు, దండగమె – దుష్టత్వమే, (కలదు – ఉన్నది,) ఇదియధ్యాహారము. అదియొతేఁగి – ఆ నేరమును దలిసికొని, కొండెగానితనానకుసరువుగానన్. కొండెగానితనానకున్ – చాడీలు చెప్పునటువంటికార్యమునకు, ఇచట 'కొండెగానితనము' అనుటకు 'సూ. తనవర్ణకంబుపరంబగునిప్పుడు తచ్ఛబ్దార్థమునకు లోపంబు విభాషనగు' ప్రౌ. వ్యా. ఉదా. "క. పె. గ్లాకొన్నతనాస" భీమ. గురువుగానన్ – అధికుఁడైయుండెనుగనుక, అమరనాథునిన్ – ఆదేవప్రభుని, చేరరాదయ్యెన్ – సమీపమునకుఁ గూడ గాదాయెనుగదా, ఈపద్యమంత్యానుప్రాసాలంకారము.

తా|| దివిజకాంత యింద్రునానతిచ్చ పొప్పనఁ బ్రివర్తింపక భూలోకమున నే కాపురముండుట్లయు, నిరంతమును వీరని ప్రేమతో వర్తించుటయు, సుగసభనుఁ బోకుండుటయు, నేరము లేకదా. ఆకారణమున నే నాగమునిఁ జూచి యంతటిభయమును కొంటినని.

తే|| భూసురవర్యున కొకనాఁడ • పోయి కౌఁగి, లిచ్చి రమ్మని పంపినా • డింతె కాని
సంతతము వానితోఁ గేళి • సల్పుమనుచుఁ, బనిచెనే తన్ను లోకైక • భర్త యైన. 24

అ|| లోకైకభర్త. లోక – భువనములన్నిటికిని, ఏక – ముఖ్యమైన, 'ని. ఏకేముఖ్యాన్యకేవలాః' అ. భర్త – అధిపతియైనయింద్రుఁడు, ఐనన్ – ఆయినప్పటికిని, తన్నున్ – అరంభను, భూసురవర్యునకున్ – భూమివేలుపైన యానిగంటుకునకు, ఒకనాఁడ – ఒక్కదినమే, పోయి – అతని దగ్గరకుఁబోయి, కౌఁగిలిచ్చి రమ్ము – ఆలింగనమొసఁగి రమ్ము, అని – ఇట్లుచెప్పి, పంపినాఁడు – అంపియున్నాఁడెను, ఇంతె కాని – ఈమాత్రమే కాని, సంతతమున్ – ఎల్లప్పుడును, వానితోడన్ – ఆబ్రాహ్మణునితో, కేళిసల్పుమనుచున్ – సంభోగించుచుండుమని, పనిచెనే – పంపించినాఁడా.

క|| ఈమాటలు ముని దివిజ, స్వామికి వినిపించె చేని • జననాథ యతం
డే మని శాసించునో యని యానాతిని యతని కంత • యలికెం జుమ్మా. 25

అ|| జననాథ – ఓరాజా, ముని – ఆనారదుఁడు, ఈమాటలు – ఇచ్చటజరిగిన సంభాషణ

అనేయను — ఆ ము[illegible] ఏమనియానతిచ్చునో — ఏవిధముగ నాజ్ఞాపించునోకదా. ఇచట 'ఏమని' అనుటకు 'ఏమా ఏ[illegible] యిత్తునకు సంధి వైకల్పికముగానగు' బా. వ్యా అని — ఇట్లుతలంచి, ఆ మానిని - ఆమానవతి, అతనికిన్ - ఆనారదునకు, అంత - అంతయనికముగా, అలికెంజుమ్మీ - భయపడెనుసుమా,

—: నారదుఁడింద్రసభకుఁ జేరుట :—

వ॥ ఇది యిట్లుండె నట నారదుండు చని యెదుట హాహా హూహూ ముఖ్య విఖ్యాతగాయన గేయ నవీనమాధురీ ఝరీతరంగనినదాయమాన మేనకాద్యప్సరః పాత్ర విచిత్రకంకణ ఝణత్కారచామీకర మేఖలాకింకిణీ ఘళఘళనూపుర కలకలధ్వనులచే సంతసించుచు సంతతవందమానత్రయస్త్రింశత్కోటి దేవతా సంసేవ్యమానుండై రత్న సింహాసనంబున నాసీనుండై యున్న సహస్రలోచనుం గాంచి నిలిచిన. 26

అ॥ ఇది - ఈవృత్తాంతము, ఇట్లుండెన్ - ఇటుండగానిమ్ము, అట- అక్కడనుంచి, నారదుండు- ఆనారదమహర్షి చని- పోయి, ఎదుటన్-తనయెదుట, హాహా......ధ్వనులచే-హాహా...... హూహూ- హాహాహూహూవులను పేరుగల, ముఖ్య - గంధర్వ ప్రముఖులలో, విఖ్యాత - ప్రసిద్ధిగల, గాయన సంగీతమును బాడునట్టి పురుషులయొక్క, గేయ - పాట, నవీన - నూతనమైన, మాధురీ - మాధుర్యమనెడు, ఝరీ - ప్రవాహముయొక్క-తరంగ - అలలతోడి, నినదాయమాన - ధ్వనించుచున్న, మేనకాది - మేనకమొదలగు, అప్సరః - దేవవేశ్యలలో అప్సరః, నీళ్లనుండిలేచినవారు అనివ్యు. "అప్సు నిర్మథనాదేవరసాత్తస్మాద్వరస్త్రియః ఉత్పేతుర్మనుజశ్రేష్ఠ తస్మాదప్సరసోఽభవన్" పాత్ర - నాట్యమాడెడుస్త్రీలయొక్క, విచిత్ర - చోద్యమైన, కంకణ - హస్తాభరణములయొక్క, ఝణఝణత్కార - ఝణఝణయనిమ్రోగుచున్నట్టియు, చామీకర - సువర్ణమయమైనమేఖలా - మొలనూలుయొక్కయు, కింకిణీ - చిఱుగంటలయొక్కయు, ఘళఘళ - ఘళఘళయనెడు, నూపుర-కాలియందెలయొక్కయు, కలకలధ్వనులచేన్- కోలాహలారావములచేత అనఁగా బహువిధములగు నినాదములచే ననుట, సంతసించుచున్ - సంతోషపడుచు, సంతత......మానుండై, సంతత- ఎడతెగని, వందమాన- నమస్కరించుచున్న, త్రయస్త్రింశత్కోటి - ముప్పదిమూడుకోట్ల, దేవతా - దేవతలచేత, సంసేవ్యమానుండై - కొలువబడుచున్నవాఁడై, రత్నసింహాసనంబునన్- దేవలోకమునఁగలమణులతో నిర్మింపఁబడిన రాజపీఠమునందు, సింహాసన మనగా సింహాముఖమేర్పఱచియుండు కనకమయ మగు నున్నతపీఠము. ఆసీనుఁడై - కూర్చున్నవాఁడై, ఉన్న సహస్రలోచనున్ — ఉండిన, వేయికన్నులుగల యాయింద్రుని, కాంచి - వీక్షించి, నిలిచినన్- నిలఁబడఁగా, 'ముఖ్యవిఖ్యాత-గాయనగేయన-మాధురీ ఝరీ-పాత్రవిచిత్ర-కంకణఝణఝణ ఇత్యాదులనుప్రాసాలంకారము.

తా॥ దీనినిట్లుండనిమ్ము. అచ్చటనుండి కలహభోజనుం డరిగి తనయెదుట హాహాహూహూవులనెడు గంధర్వప్రముఖులలోఁ బ్రసిద్ధికెక్కిన సంగీతవిద్యాధికులయొక్క గానమునందలి మాధుర్యమనెడు ప్రవాహముయొక్క యలలతోఁగూడి ధ్వనించుచున్న మేనక మొదలగు దివిజవేశ్యలలో నర్తకీమణుల [illegible] చిత్రమైన హస్తాభరణములయందలి ఝణఝణ యనుమ్రోఁతయొక్కయు,నపరంజి మొలనూళ్ల

రొక్కయు, జిఱుగంటలయొక్కయు ఘళఘళయను కాలియందెలయొక్కయు మిశ్రితరవములచేత నానందమునొందుచు ననిశము నమస్కరించుచున్న ముప్పదిమూఁడుకోట్ల దేవతలచేఁ గొలువఁబడును దివ్యమణులతో రచించఁబడిన రాజపీఠమునందుఁ గూర్చుండిన వేయికన్నులవానిం గాంచి నిలువంబడఁగా.

—: ఇంద్రుఁడు నారదుని సమాచారములడుగుట :—

క॥ మునినాథుఁ గాంచి సురపతి, ప్రణుతసమారాధనార్ఘ్య ♦ పాద్యాదివిధు
ల్వినయముగ నొసఁగి యర్హాసనమునఁ గూర్చుండ నునిచి ♦ సలలితబుద్ధిన్. 27

అ॥ సురపతి - ఆదేవతాప్రభువు, మునినాథున్ - మునులలో శ్రేష్ఠుఁడగు నారదుని, కాంచి - వీక్షించి, సలలితబుద్ధిన్ — ప్రకాశించుచున్న తెలివితో, ప్రణుత......విధుల్, ప్రణుత - స్తోత్రము చేయఁబడిన, సమారాధన - పూజించుటయును, అర్ఘ్య - పూజాద్రవ్యమును, పాద్య - పాదోదకమును, ఆది - మొదలుగాఁగల విధుల్ - విధానములను, చేయుటలను, వినయముగన్ - నీతితో, ఒసంగి - ఇచ్చి, అర్హాసనమునన్, అర్హ - ఉచితమైన, ఆసనమునన్ - పీఠమునందు, కూర్చుండనునిచి - ఉపవిష్టుఁడగునట్లుచేసి,

తా॥ దివస్పతి యమ్మునిశ్రేష్ఠునిఁ జూచి తనబుద్ధికుశలత దీపింపఁ బూజాద్రవ్యమును పాదోదకము నిడి తగినపీటయందు గూర్చుండఁజేసి.

క॥ మునియనుమతిఁ దానుచితా, సనమునఁ గూర్చుండి సత్ప్ర ♦ సంగంబున నో
యనఘాత్మ యెచటి కరుగుచుఁ, జనుదెంచితి రిటకు నాదు ♦ జన్మఫలమునన్! 28

అ॥ మునియనుమతిన్ - ఆనారదునియొక్క సమ్మతితో, తాన్ - ఆయింద్రుఁడును, ఉచితాసనమునన్ - తనకర్హతగల సింహాసనమున, కూర్చుండి - ఆసీనుఁడై, సత్ప్రసంగంబున్ - మంచిప్రస్తావనతో, ఓయనఘాత్మ - ఓపుణ్యపురుషుఁడా, ఎచటికరుగుచున్ — ఎచ్చోటికి బోవుచు, నాదుజన్మఫలమునన్ - నాయొక్క జననకాల శుభప్రాప్తివలన, ఇటకున్ - ఇచ్చటికి, చనుదెంచితిరి - వచ్చితిరి, ఈ బహువచనప్రయోగమునకు "స్యాత్పూజ్యత్వ వివక్షాయాం మహతాం బహుతా మతా" అని యర్థ. ఇచట ప్రస్తావనవశమున నారదునడుగుటయు నాతఁడు రంభయొక్క కృత్యములను జెప్పుటయును యుక్తియుక్తమే 'సూతాః పౌరాణికాః ప్రోక్తా మాగధా వంశశంసకాః, వందినస్త్వమలప్రజ్ఞాః ప్రస్తావసదృశోక్తయః' అని శాస్త్రము. 'మునియనుమతితానుచితా' అనుప్రాసాలంకరము.

తా॥ ఆసంయమిసమ్మతితోఁ దానును దనసింహాసనమునఁ గూర్చుండి మంచిప్రసంగసందర్భమున నోపుణ్యాత్మా! ఎచ్చటికిఁ జనుచు నాయదృష్టవశమున నిటకుదయచేసితిరి?

—: నారదుఁడు రంభ నేరములఁ జెప్పుట :—

క॥ అన విని ముని దరహాసితా, ననమున సురలోకనాథ ♦ నానాదిశలం
జని భువిని జిత్రమొక్కటి, గని వచ్చితి మీకుఁ దెలుపఁ ♦ గాఁ బనిగలదై. 29

అ॥ అనన్ - ఇట్లుపలుకఁగా, విని - ఆకర్ణించి, ముని - ఆనారదముఁడు, దరహాసిత - చిఱునవ్వుతోఁగూడిన, ఆననమునన్ - ముఖముతో, సురలోకనాథ - ఓస్వర్గాధిపతీ, నానాదికలన్ - అనేకదిక్కులకు, చని - పోయినవాఁడనై చిత్రము - ఆశ్చర్యము, ఒక్కటి - ఒకటి, కని - చూచి, మీకుఁదెలుపఁగాన్ - దానిని మీకుఁజెప్పుటకు, పనిగలనై - కార్యముగలవాఁడనై, వచ్చితిన్ - ఏతెంచితిని, నారదుఁడు కలహములను బెట్టువాఁడగుటయేకాక యింద్రుని ప్రసంగవశమయిన ప్రశ్నయును హేతువేయయినది, 'అన. విని. ముని' అనుప్రాసాలంకారము.

తా॥ అని విని నారదుఁడు మందహాసముతో నోత్రివిష్టపాధిపతీ నేను నానాదిశలయందుఁ జరించి యొకచిత్రము చూచి దానిని మీకుఁజెప్పఁ బనిగలిగి వచ్చితి.

క॥ మునినాథ యేమిచిత్రము, గనుఁగొంటివో యానతీయుఁ ♦ గదవే యిఁక న
న్వినవోయి నముచిసూదన, యనిమిషతరుణీలలామ ♦ యవనీస్థలిలోన్. 30

అ॥ మునినాథ - ఋషిశ్రేష్ఠుఁడవగు నోనారదముఁడా, ఏమిచిత్రము - ఏమిచోద్యము, కనుఁగొంటివో - చూచియున్నావో, ఆనతీయ గదవే - సెలవియ్యఁగదవయ్యా, అనినన్ - ఇట్లువచింపఁగా, నముచిసూదన - నముచియను రాక్షసునిఁజంపిన యోయింద్రుఁడా, వినవోయి - నేఁజెప్పు వృత్తాంతము నాకర్ణింపుము, అనిమిషతరుణీలలామ - దేవవేశ్యలలో యౌవనవతి యగునారంభ, అవనీస్థలిలోన్ - భూమియందొకచోట, పైపద్యముతో నన్వయము. ఈపద్యమున 'నానతీయుఁ గదవే' అనుటకు "ప్రార్థనార్థే భవే న్నాంతాక్రియ ర్థ విశేషదః" అథ.

తా॥ ఓమునీంద్రా నీవు కనుఁగొనిన వింతయేమిటో సెలవిమ్మనఁగా సురత్రాణా వినుము. రంభయను నప్సరోంగన భూలోకమున నొకచోట.

క॥ అలనాఁటనుండి ద్విజునిం, గలగొని యిటు రాక యుండెఁ ♦ గా దానికి నా
యిలవేల్పే యిలువేలుపు, బలభేదన యేమిచెప్పఁ ♦ బనియున్నదిఁకన్. 31

అ॥ బలభేదన - బలాసురుని సంహరించినవాఁడా, అలనాఁటనుండి - శివునిఁగూర్చి నన్ను సరించి నీపురంభకాజ్ఞయొసంగిన దినమునుండియు, ఇచట 'అల' దేశ్యము ప్రసిద్ధిని దెలుపునది. 'అల్ల' అనియు రూపముకలదు. ద్విజునిన్ - ఆబ్రాహ్మణుని, కలగొని - లోఁగొని, ఇటు - ఇక్కడికి, ఇదిదేశ్యము. రాకయుండెఁగా - రాకయున్నదిగదా, దానికిన్ - ఆయొక్కరంభకు, ఆ ఇలవేల్పే - ఆబ్రాహ్మణుఁడే, ఇలవేలుపు - గృహదైవము, ఇంటియందు నిత్యమును బూజించుదేవుఁడు. ఉదా. "చ. ప్రమదవిలాస నర్తనవి♦భాసుర గోపకిశోరమూర్తితోఁ దమ కిలువేలుపై వెలయు♦తాంతవకృష్ణపదాబ్జసేవ" కళా. ఇఁకన్ - ఇఁకమీఁదట, ఈచెప్పినదానికంటెనునట, ఏమిచెప్పబడియున్నది - నేఁజెప్పవలసిన పనియేమికలదు, సమస్తమునీకే తెలియునునట, ఈ పద్యమున 'నాయిలవేల్పే యిలువేలుపు' అనుప్రాసాలంకారము.

తా॥ ఓబలవైరీ శివునాజ్ఞ నను వరించి నీవు రంభకు సెలవిచ్చిననాఁటనుండి యాబ్రాహ్మణుని తనవశపఱచుకొని స్వర్గమునకే రాకుండెనుగదా! దాని కతఁడే యింటిదేవరయైనాఁడు. ఇఁక నేఁజెప్ప వలసిన దేమున్నది?

క॥ సురతనయుల సంభోగము, నిరసింపఁగ వింటి దాని ♦ నేరంబునకై
సురనాథ నిన్నయఁ బలెఁ, బరిపాలన మిట్లుచేయఁ ♦ బఱపితి వనుచున్ 32

అ॥ సురనాథ — ఓయింద్రుఁడా, సురతనయులసంభోగమున్ — దేవతలకుమార్త్రులయొక్క సంభోగమునందు నీతిగలవారియొక్క రతికేళిని, నిరసింపఁగన్ — తిరస్కారముచేయఁగా, వింటిన్ — నేనువినియున్నాను, దాని నేరంబునకు + ఐ — ఆబిడయొక్క దుష్టస్వభావమునకొఱకుగాను, ఇట్లు — ఈప్రకారముగ, పరిపాలనము — ఈస్వర్గమును గాపాడునట్టి కార్యమును, చేయన్ — చేయుటకు, పఱపితివి — పొంపించితివి, అనుచున్ — ఇట్లుపలుకుచు, నిన్నయనవలెన్ — నిన్నే నిందించవలయునుసుమా, ఇచటఁ బరిపాలనాలోపము నీయందియే కాని దానివల్ల నేమికల దనుటచే వ్యాజస్తుత్యలంకారము. "వ్యాజ స్తుతిర్ముఖే నిందాస్తుతిర్వా రూఢి రన్యథా" కా. ప్ర. ఉదా. "క. అసమరణరంగములనీ, యసినటినటియింప గరులహయలన్ విరులన్, వెసనొసఁగు నార యెంతటి, రసికుఁడు నీవైరి యోంబరాజ్యసింహా" కా. సం. "హే హేలాజితబోధిసత్వ వచసాం కింవిస్తరైస్తోయధే నాస్తి త్వత్సదృశః పరః పరహితాధానే గృహీతవ్రతః, తుష్యత్పాంథజనోపకారఘటనావైముఖ్యలబ్ధాయశో, భారప్రోద్వహనే కరోషి కృపయాసాహాయ్యకం యన్మరోః" పుంజ.

తా॥ ఆబిడ సంభోగవిద్యయం దారితీరిన దివిజసమాజులనైతేము నిందింపఁగా నేను వింటిని. దాని నేమిచేయఁగలము. స్వర్గపరిపాలన మిట్లున్నందులకు నిన్నే తెగడవలయును.

గీ॥ కాన నీభోగసంపద ♦ ఘనము లిచటి, సొంపు పెంపును రంభకు ♦ నింపుసట్ట, దనుచుఁ
దోఁచు మనున్న నో ♦ యనిమిషేంద్ర, మానవులమీఁదియధికస ♦ మ్మతముఁ జూచి 33

అ॥ ఓయనిమిషేంద్ర — సురపతివగు నోయింద్రుఁడా, ఆపెకు, మానవులమీఁద — నరులపైని, అధికసమ్మతమున్ — ఎక్కువైనయిష్టమును, చూచి — కనుగొంటిని, కానన్ — కనుక, ఉదా. "సీ. కానఁబమ్మహితుఁడు ఘనప్రకాలంబున" వి పు. నీభోగసంపదఘనములు, నీ — నీయొక్క, భోగ — సుఖముయొక్కయు, సంపద — కలిమియొక్కయు, ఘనములు — గొప్పతనములు, ఇచటి సొంపు పెంపు ఇచటి — ఈప్రదేశమునగల, సొంపు — యోగ్యతయొక్క, పెంపు — సమృద్ధి, రంభకున్ — దేవదాసియగు నాయొక్కరంభకు, ఇంపు పుట్టదనుచున్ — ఆనందము కలిగించుటలేదని, తోఁచుచున్నది — నాకుస్ఫురించుచున్నది. 'సొంపు పంపు ఇంపు' అనుప్రాసాలంకారము.

తా॥ దానికి మానవులమీఁది మిక్కుటమైన యనురాగమును జూచి నీభోగసంపద్వృద్ధులారంభకేమాత్రమును సంతోషమును గలిగించుట లేదని నాకు విదిత మగుచున్నది.

చ॥ ఘనసలకూబరాదు లవ ♦ మానము నొందెద రంచు న్నాఁడె నో
యనిమిషలోకనాథ యది ♦ యాఘరణీసురపుత్త్రితోడ నా
డీనవచనంబులెల్లఁ బ్రక ♦ టింపను నట్టివిబైటఁబెట్టఁగా
మునులకు నూకు నేల విను ♦ ఘోరాహముగా కది దానిపాపమే 34

అ॥ ఓయనిమిషలోకనాథ — స్వర్గాధిపతివగు నోయింద్రుఁడా, విను — అవధరింపుము, అది — ఆయొక్కరంభ, ధరణీసురపుత్రుతోడన్ — బ్రాహ్మణునికొడుకైన యానిరంకుశునితో, మా నలకూబ రాదులు — మనస్వర్గమునందున్న నలకూబరుఁడు మున్నగాఁగలవారు, అవమానమున్ — పరాభవమును, ఒందెదరంచున్ — పొందెదరనుచు, ఆడెన్ — పలికెను, ఆడినపలుకులెల్లన్ — అదియున్నితోఁ. చెప్పిన మాటలన్నియు, ప్రకటింపన్ — స్పష్టపఱచుటకును, అట్టివి — అట్టివి, బైటఁబెట్టఁగన్ — బహిరంగము చేయుటకును, మునులకున్ — ఋషులకు, మాకున్ — మావంటివారికి, అనఁగా ఋషుల మైనమముబోంట్లకనుట, ఏల — ఎందుకు, అక్కఱలేదనుట, అది — అట్టిప్రసక్తిన, మోహముగాక — వలపుగాక, దానిపాపమే — దానిదోషమా, అనఁగా వానియందావిర్భవించిన మోహకారణముగ నట్లు జరిగినది. గాని పాపము దానిదనుటవలన నేమిప్రయోజనమనుట, ఇందు మూఁడవపాదమున వర్గజయతి చెప్పఁబడినది. క. తనుతను యనునాసికవర్ణములు విడిచి వెనుక విభుల నాల్గుపదములోఁ, దనుదు నర లేక నిలిచిన ననురాహిత దమువర్గయతులనఁబరగున్. అప్ప. 'అదిమోహముగాక దానిపాపమా' యనుటచేత అలంకారము వ్యాజనింద. 'నిందాయానింద యావ్యక్తిర్వ్యాజనిందేతి గీయతే విశ్లేష నిందోయస్తే ప్రోగేకమేవాహురచ్ఛిరః' అని కువ.

తా॥ ఓ స్వర్గప్రభూ విన్నావా మననలకూబరాది యావను లాబ్రాహ్మణకుమారునకు పరిరాక యవమానమును బొందుదురనెను. అది పలికినపలుకులెల్లఁ దేటపఱచుటకును బైటఁబెట్టుటకును మునుల మగు మావంటివారికి దులకు? అదియంతయు మమకారముగాని దానినన్నందువలనఁబ్రయోజనమేమి?

—: ఇంద్రుఁడు రంభపై నాగ్రహించుట :—

చ॥ అన విని వజ్రి మండిపడి ♦ యౌర సవు నారద యద్దురాత్ముర్గా
లనిమిషలోకభోగభర ♦ మల్పముగాఁ దలపోయుకున్న న
మ్మనుజుని బాయుకున్నె బళి ♦ మంచిది దానికి నేన గర్వముం
బెనిచితి నిన్నినాళ్లు నీకఁ ♦ బెద్దతికం బోకయింత కుంచెదన్. 35

అ॥ అనన్ — ఇట్లువచించఁగా, విని — ఆకర్ణించినవాఁడై, వజ్రి — వజ్రమే యాయుధముగా గల యాయింద్రుడు 'ని. వజ్రంత్వస్త్రీకులిశశస్త్రయోః మణివేధేరత్నభేదే" కేశవ. 'వజ్రపాణిర్మ హేంద్రః సురగ్రామణీర్యామనేమిర్వృషానాకనాథోహరిః' త్రి. శే. మండిపండి — కోపముయొక్క యధికముగలవాఁడై, నారద — ఓనారదమహర్షీ, ఔనవున్ — అవునవును, నీవుచెప్పినది సత్యమే యని త్వరితముగాఁజెప్పుట. ఉదా. శా. 'ఔనౌవేవెలయాల' దశా. చ. అద్దురాత్మురాలు — దురాత్మురాలైన యాయొక్కరంభ, అనిమిషలోకభోగభరమున్ — అనిమిషలోక — స్వర్గమునఁగల, భోగ — ఆనందముయొక్క, భరమున్ — అధికమును, అల్పముగాన్ — అణుమాత్రముగా — కొంచెముగా, తలపోయకున్నన్ — ఎంచకుండినట్లయిన, అమ్మనుజునిన్ — ఆమానవుని, పాయకున్నె — విడువకుండునా, బళి — మెచ్చుట. మంచిది — సరియేకానిమ్ము, అనఁగా దానిపని కనుగొనియెదనని కోపముతో నంగీకరించుట, దానికిన్ — అయచ్చరకు, నేన — నేనే, ఇన్నినాళ్ళు — ఇంతకాలమువఱకు, గర్వమున్ — అహంకారమును, ని. 'గర్వోఽభిమానోఽహంకారో' చిత్తోద్రేకస్తు యోమదః' అని అ.

పెన్నిచితిఙ్ — వృద్ధిచేసితిని, ఇఁకఙ్ — ఇఁకమీఁదట, పెద్దతికంబు — అబిడయొక్క ఘనము౯, ఒక యింత — కొంచెము, కుంచెదఙ్ — తక్కువచేయుదును, ఇందు 'జౌనవుఙ్' అనుటకు 'సూ. అద్రుతాసామజాతీనాం ద్వియుక్తావంత్యలోపితా, అన్యేషాంచద్వియుక్తాన్యుర్బహులోపాగమాయతాః' అథ. దురాత్మ్రగాలనుటకు 'సూ. దారార్థేఽత ఉదపిరః' అని నన్న. 'పెద్దతికము' అనుటకు 'సూ. అన్యే చ బహవో దేశ్యపక్షకాః అస్థేవకాః క్వచి దంత్యస్య లోపస్స్యాత్కృవ్వని ద్వర్ణాగమో మతః' అథ.

తా॥ ఇట్లుచెప్పఁగా విని వేల్పువౌర కనలి నారదా అవునవును. ఆదుర్మార్గురాలు దేవలోక సౌఖ్యాధికము నల్పముగా నెంచుచున్న నానరుని విడువకుండునా? ఔరౌరా దానిసాహసము, సరే కానిమ్ము. దాని కింతటి మగనిమును బెంచినది నేనే ఇక నట్టిగొప్పతనమును దగ్గించెదను.

ఉ॥ ఓమునిసార్వభౌమ సర ♦ సోక్తుల బాపనమిండగానితో
నే మని నిందసేసె జగ ♦ దీడితరూప విలాససంపదు
ద్దామశరీరులం ద్రిదశ ♦ ధామకుమారుల లంజసానినే
రో? 'మనసశ్శునాంఘృతమ ♦ రోచక' మన్నలుకాచరించునో. 36

అ॥ ఓమునిసార్వభౌమ—ఋషులలోఁ జక్రవర్తివగు నో నారదుఁడా, బాపనమిండగానితోఙ్—బ్రాహ్మణుఁడయిన అంకువగనితో, సరసోక్తులఙ్ — సరసములాడుటయందు, జగ......రులఙ్, జగత్ — ఈమూఁడులోకములయందు, ఈడిత— స్తుతింపఁబడిన, 'ని. ఈడితశ స్తపణాయిత పణాయిత ప్రణుత పణిత పనిదాని అవగీర్ణవర్ణితాభిష్టుతేళితాని స్తుతార్థాని. అ. రూప — చక్కఁదనముతోఁ గూడిన, విలాస — ప్రకాశముయొక్క, సంపత్ — అతిశయము, ఉద్దామ — మదించిన, శరీరులఙ్. తనువుగలవారిని, త్రిదశధామకుమారులఙ్ — త్రిదశధామ — దేవతలనివాసమగు స్వర్గమునఁగల, 'సూ. సంఖ్యయావ్యయాసన్నా దూరాధిక సంఖ్యాః సంఖ్యేయే, త్రిర్దశపరిమాణమేషా అస్తీతి త్రిదశాః, ఇత్యాదినాబహుర్వీహిః' 'సూ. బహువ్రీహౌ సంఖ్యేయేడజబహుగణాత్' సిద్ధాం. ఇతి క్షీరస్వామి. త్రిదశ తృతీయమైన కౌమారదశ సర్వదాకలవారనియ్యు. కుమారులఙ్ — యౌవనపురుషులను, ని. 'కుమారో బాలకేస్కందే యువరాజేశ్వచారకే' విశ్వ. ఏమనినిందచేసెఙ్ — ఏమని దూషించినది. లంజసానినేరో — వ్యభిచారస్త్రీలలో నధికురాలైనదానియొక్క జాణతనమైయుండు నేమో, "మనసశ్శునాంఘృత మరోచకమ్" (కుక్కలయొక్క మనస్సునకు నెయ్యిరుచిదానుండదు) అన్నలుకు — అనువాక్యమును, ఆచరించునో — నడుపునేమో, అనఁగాఁ గుక్క నేయిపనికిరాదని దుర్వాసనగల్ల చెడుపదార్థములఁదినినట్లు దివ్యభోగముల నిరసించి మానవుని పొందఁగోరుచున్న దేమో యనుట, ఇచట 'ఆచరించునో' అనుటకు "సూ. ఏదోతౌవ్యతిరేకాదపి సంప్రార్థన పరాక్రియాణాం స్తః" నన్న. ఇందు 'సరసోక్తులఙ్' అనుచోట 'ఇతరత్రచద్వితీయా' అనెడు సూత్రముచేత సప్తమ్యర్థమునందు ద్వితీయవచ్చినది. నాలుగవపాదమున నఖండయతి చెప్పఁబడినది. ఇందు 'మనసశ్శునాం ఘృత మరోచకం + అన్నలుకు, అని సంధిచేయుటవలన మకారమయినది. "సూ. శబ్దానామంత్యభాగేషు గోఽనుస్వారః ప్రదృశ్యతే, తస్యాచిపరతో మస్స్యాత్సర్వత్రహరిసమ్మతేః" అన్నలుకు అనుటకు సూ. పదాంతంబులై యసంయుక్తంబులయినను, లు, రు, లయుత్వంబునకు లోపంబు బహుళంబుగనగు. బా. వ్యా. లోకోక్త్యలంకారము. 'ఉద్దామశరీరులఙ్ ద్రిదశధామ కుమారులఙ్' అనుప్రాసాలంకారము.

కాంతిని, బాలచంద్రుఁడు సన్ననిగీఱవలెనుండును. 'ని. రేఖాస్యాదల్పకే ఛద్మన్యాభోగోల్లేఖయోరపి' విశ్వ. హసింపన్ - పరిహాసముచేయఁగా, ఎగతాళిచేయఁగా. ఇచట నునుమేని నవనఖాంకురములనఁగా గామశాస్త్రమున నిట్లు చెప్పఁబడియున్నది, 'నఖాఘాతః ప్రగాఢత్వాద్యథాస్థానాని కథ్యతే పార్శ్వయోః స్తనయోశ్చైవ ఊరౌ చ నితంబకే, కక్షస్థలే చ కణ్ఠాంతే కపోలే బాహుమూలకే' అనఁగా స్తనములు, చెక్కిళ్లు, చెవితమ్మెలు, బాహుమూలములు, మున్నగునవి. జాఱుకొప్పునన్ - కొంచెము క్రిందికి దిగఁబడిన ధమ్మిల్లమునందు, ముడిచిన జాజివిరులతావి - ధరించినట్టి జాతీపుష్పములయొక్క పరిమళము, తనతోడియచ్చరలేఁబోండ్ల - తనతో సమానులైన పువ్వుమువలె మనోజ్ఞురాండ్రయిన యప్సరసలయొక్క, కైశ్యకల్పప్రసూనసౌగంధ్యము కైశ్య - కొప్పులయందలి, 'కేశానాం సమూహః కైశికం కైశ్యం చ' 'సూ. కేశాశ్వాభ్యాం యఞ్ఛావన్యతరస్యామ్' సిద్ధాం. పక్షే ఠగణే కైశ్యం కైశికం కేశానాం సమూహః ఇతివిగ్రహః: కల్పప్రసూన - దేవలోకమునఁ గలకల్పవృక్షములయొక్క, సౌగంధ్యమున్ - సువాసనను, అడఁపన్ - అణఁగియుండునట్లు చేయఁగా, దేవతారాజసభకున్ - సురలకధిపతియగు నాయింద్రునియొక్క సుధర్మయనుసభకు, చనుదెంచెన్ - వచ్చెను, ఇందు 'ములువాఁడి పలునొక్కులు' అనుప్రయోగములకు "సూ. ప్రథమములగపిద్విసులోపః" సన్న. "సూ. అద్విత్వం చ భవే ద్దిత్వం దీర్ఘో హ్రస్వస్య కేషుచిత్" అన. మఱియు నీసీసపద్యద్వితీయపాదమున 'మకరికాపత్త్రి సంపదవహింప' అనుచోట బిందుయతి చెప్పఁబడినది. "క. పనిబూని నిలుచుఁ దమతమ, యనునాసికములకు బిందుయతులను వెనుకన్, గనుపట్టు నాల్గులిపులును, జెను సున్నలు డాపి తమకుఁ బొలుఁద గడియుచోన్" అప్ప. ఇచట రంభయొక్క జాఱుకొప్పున నున్న జాజిపూవుల పరిమళమును గల్పప్రసూనములకంటె నెక్కువగా వర్ణించుటచేత రతికాలమునఁ గలిగిన పరిమళమతిశయించెనని భావము. అలం. స్వభావోక్తి. "స్వభావోక్తి రసౌచారు యథావద్వస్తువర్ణనమ్" ప్రతా. మోవిపై...సొగసుఁజూప - చెక్కుల...వహింప - నునుమేని...హసింప, ఇత్యాద్యులుపమాలంకారము, "స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి, ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిందతి, తస్యచానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః, ఉపమాయామిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః" దండి. ఇచట రంభ నిరంకుశునితోఁ గూడి విహరించి కేళీగృహమునుండి యిప్పుడే బయటికి వచ్చిన లక్షణములను దెలియఁజేసినాఁడు. సంస్కృతమునఁగూడ నిట్టివి కలవు. "బిభ్రాణాంకురపల్లవేవ కబరీ మేకేన పర్యాకులా, మధ్యేన స్తనమండలే నిదధతీ ప్రస్తం దుకూలాంచలం, ఏషా చందనలేశలాంఛితతను స్తాంబూలరక్తాధరా, నిర్యాతి ప్రియమందిరా ద్రతిపతే స్సాక్షాజ్జయశ్రీరివ" పుష్ప. ఉత్ప్రేక్షాలంకారమును, కూచిమంచి తిమ్మకవియు నిట్లె వర్ణించినాఁడు.

సీ. ఎడసిన జిలుఁగు ప ♦ య్యెదతోడ ముడిపీడి, నేలఁజీఱాడు పె ♦ న్నెఱులతోడఁ
గరఁగి నెమ్మొగమెల్లఁ ♦ బెరయు కస్తురితోడఁ, దొలఁగిన చెవిపూవు ♦ గోయితోడ
గుడుగక నినుచు ని ♦ ట్టూర్పుగాడ్పులతోడ, జాఱిన నెఱిబన్న ♦ సరముతోడఁ
జెదరిన పాపట ♦ చేప్పుక్కబొట్టుతోఁ, బొడిపొడియైన మే ♦ పూఁతతోడ

తే॥ మగనిపిమ్మట నెమ్మేను ♦ మఱచినిదుర, జెందు ముంగోపకిని జూచి ♦ చెలువలిద్దఱు
చెదుతెఱంగులుఁగడుసన్నఁబడఁ దొడంగె, నంచుఁ దలయూఁచి చయ్యనఁ జనటువదలి. అచ్చ తె. రా.

తా॥ రంభ మోవిపైఁ జిన్నిచిన్న పద్మరాగమణులో యనునట్లు ప్రకాశించుచున్న దంతక్షతములతోను, చెక్కులపైఁ జెదరి మకరికాపత్త్రములవలె దీపించుచున్న శిరోజములతోను, గుండ్రని

స్తనములపైఁ బగుళ్ళవాణిగంధముతోఁ గూడిన పుష్పమాలికలను మాటుపఱచిన పయ్యెదతోను, సుందరమయిన శరీరమున బాలచంద్రుని కాంతిని మించుచున్న నఖరేఖలతోను, కొంచెము దిగజాఱిన కొప్పునఁ దనకీడగునచ్చరలతల్లలయందుఁగల దేవతాకుసుముల సువాసన నడఁగించుచున్న జాజిపువ్వుల పరిమళముతోను, సుధర్మాంతరమున కేతెంచెను.

తే॥ వచ్చి భయభక్తు లెసఁగంగ ♦ వాసవాదు, లైన పెద్దల కొకపాటి ♦ యాననంబు
వంచి మడిసందులను హస్త ♦ వారిజంబు, లిడి యొకించుక వెనుకకు ♦ నేగి నిల్చె. 40

అ॥ వచ్చి – ఏతెంచి, భయభక్తులు – భీతియును సేవకావృత్తితోఁగూడిన యనుసరణమును, ఎసఁగంగన్ – ఒప్పునట్లుగా, వాసవాదులు – ఇంద్రుఁడు మొదలగువారు, ఐన పెద్దలకున్ – అయిట్టి గౌరవముగలవారలకు, ఒకపాటి – ఒకవిధముగా, మితముగాననుట. ఆననంబువంచి – మొగము వంచినదై, అనఁగా సంజ్ఞగా నమస్కరించినదనుట. మడిసందులను – మడుచుకొనిన దండచేతులయందు, హస్తవారిజంబులు – పద్మములవంటి కరములను, ఇడి – ఉంచి, ఒకకొంత – కొంచెము, వెనుకకున్ – పశ్చాద్భాగమునకు, ఏగి – పోయి, నిల్చెన్ – నిలువఁబడెను, ఈపద్యమున 'సందులు' అని ప్రయోగించుటకు "సూ. దలటా ముదితాం లుకొన్స్యత్ ప్రాయశో లేలువర్ణకే, వైకృతానాం లుకిభవేల్లటయో రేకరూపతా" అన. ఇందు వాసవాదులైన పెద్దల కొకపాటి యాననంబువంచి, అనుటచే రంభకుఁ గలగర్వము సూచితము. నాట్యస్త్రీలక్షణమును దెలియఁజేయుటచే స్వభావోక్త్యలంకారము.

తా॥ వచ్చి భయవినయములతో నింద్రుఁడు మొదలగు గొప్పవారలకు మితముగా నమస్కారసంజ్ఞను గనఁబఱచి సందిళ్ళు మడుచుకొని కొంచెము వెనుకకుఁబోయి నిలువఁబడెను.

—: రంభ నారదునిజూచి భయపడుట :—

క॥ తనజాడ లన్ని యచ్చటఁ, గని వచ్చినయట్టిమౌని ♦ కంఠీరవు న
య్యనిమిషసంయమిఁ గని య, య్యనిమిషలోచనకు హృదయ ♦ మట్టిట్టయ్యెన్. 41

అ॥ అచ్చటన్ – భూలోకమున, తనజాడలు – తానుచేసినసైగలు మున్నగు తనప్రవర్తన యొక్క రీతులు, ఇచట 'జాడలు' అనుటకు దా. "క. పరికింపను తమజాడలు" పారి. అన్ని – సమస్తమును, కనివచ్చిన యట్టిమౌనికంఠీరవున్ – కనివచ్చిన – కనుఁగొనివచ్చిన, అట్టిమౌనికంఠీరవున్ – అటువంటి మునిశ్రేష్ఠుని, ఇచట కంఠీరవుఁడనుటకు. "ని. సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః" అ. అయ్యనిమిషసంయమిన్ – దేవర్షియగు నా నారదుని, కని – వీక్షించినతోడనే, అయ్యనిమిషలోచనకున్ – మత్స్యమువంటి నేత్రములు గలదయిన యారంభకు, 'ని. అనిమేషశ్చాని మేషోఽప్యతోద్యానుర మత్స్యయోః' నానా. హృదయము – మనస్సు, అట్టిట్టయ్యెన్ – కరిపరివిధములఁ దిరుగుచు నుండెను, ఈపద్యమున 'కనివచ్చినయట్టి మౌని' అనుచోట నః వచ్చుటకు 'సూ. కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చేదృశ్యాత్ స్యాత్' నన్న. అనిమిష శబ్దము రెండుమారులుచ్చరింపఁబడుటచే యమకాలంకారము.

